# అథ పంచదశో%ధ్యాయః

# పాతాళ లోక వర్ణనము

వ్యాస ఉవాచ |

యేనైకేన హి దత్తేన సర్వేషాం ప్రాప్యతే ఫలమ్ | దానానాం తన్మమాఖ్యాహి మానుషాణాం హితార్థతః || 1

వ్యాసుడు ఇట్లు పలికెను-

ఏ ఒక్క దానముచే సర్వదానముల ఫలము లభించునో, ఆ దానమును గురించి మనుష్యుల హితము కొరకై నాకు చెప్పుము (1).

సనత్కుమార ఉవాచ |

శృణు కాలే ప్రదత్తాద్వై ఫలం విందంతి మానవాః |
ఏకస్మాదపిసర్వేషాం దానానాం తద్వదామి తే || 2

దానానాముత్తమం దానం బ్రహ్మాండం ఖలు మానవైః | దాతవ్యం ముక్తికామైస్తు సంసారోత్తారణాయ వై || 3

బ్రహ్మాండే సకలే దత్తే యత్ఫలం లభ##తే నరః |
తదేకభావాదాప్నోతి సప్తలోకాధిపో భ##వేత్ || 4

యావచ్చంద్రదివాకరౌ నభసి వై యావత్స్థిరా మేదినీ తావత్సో%పి నరస్స్వబాంధవయుతస్స్వర్గౌకసామోకసి |

సర్వేష్వేవ మనోనుగేషు కకుభిర్బ హ్మాండదః క్రీడతే పశ్చాద్యాతి పదం సుదుర్లభతరం దేవైర్ముదే మాధవమ్ || 5

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

మానవులు సకాలములో చేసిన ఏ ఒకే దానము వలన సర్వదానములు ఫలమును పొందెదరో, ఆ దానమును గురించి నీకు చెప్పెదను. వినుము (2). దానములలో ఉత్తమమైనది

బ్రహ్మాండదానము. ముక్తిని కోరు మానవులు సంసారమును అతిక్రమించుటకై ఈ దానమును చేయవలెను. (3). బ్రహ్మాండదానము వలన ఏ ఫలము లభించునో, ఆ ఫలములో చిన్న అంశముచే మానవుడు ఏడు లోకములకు అధిపతి యగును (4). దిక్కులతో సహా బ్రహ్మాండమును దానము చేసిన మానవుడు ఆకాశములో సూర్యచంద్రులు ఉన్నంతవరకు, భూమి స్థిరముగా నున్నంతవరకు, తన బంధువులతో కూడి దేవతల నివాసమగు స్వర్గములో సంగీతములను వింటూ క్రీడించును. ఆ దేవతలు అందరు ఆతని మనస్సునకు అనుకూలముగా ఉండెదరు. తరువాత అటు దేవతలకు కూడ మిక్కిలి పొందశక్యము కాని విష్ణుపదమును పొంది ఆనందించును (5).

వ్యాస ఉవాచ |

భగవన్ బ్రూహి బ్రహ్మాండం యత్ప్ర మాణం యదాత్మకమ్ |
యదాధారం యథాభూతం యేన మే ప్రత్యయో భ##వేత్ || 6

వ్యాసుడు ఇట్లు పలికెను-

ఓ పూజ్యా! బ్రహ్మాండముయొక్క ప్రమాణము ఎంత? దాని స్వరూపము ఎట్టిది? దానికి ఆధారము ఏది? దాని నిర్మాణము ఎట్టిది? ఈ విషములను నాకు తెలిసే విధముగా చెప్పుము (6).

సనత్కుమార ఉవాచ |

మునే శృణు ప్రవక్ష్యామి యదుత్సేధంతు విస్తరమ్ | బ్రహ్మాండం
తత్తు సంక్షేపాచ్ఛ్రు త్వా పాపాత్ప్ర ముచ్యతే || 7

యత్తత్కారణమవ్యక్తం వ్యక్తం శివమనామయమ్ |
తస్మాత్సంజాయతే బ్రహ్మ ద్విధా భూతాద్ధి కాలతః || 8

బ్రహ్మాండం సృజతి బ్రహ్మ చతుర్దశభవాత్మకమ్ | తద్వచ్మి
క్రమతస్తాత సమాసాచ్ఛృణు యత్నతః || 9

పాతాలాని తు సప్తై#్తవ భువనాని తథోర్ధ్వతః | ఉచ్ఛ్రాయో
ద్విగుణస్తస్య జలమధ్యే స్థితస్య చ || 10

తస్యాధారః స్థితో నాగస్స చ విష్ణుః ప్రకీర్తితః | బ్రహ్మణో వచసో హేతోర్బిభర్తి సకలం త్విదమ్ || 11

శేషస్యాస్య గుణాన్ వక్తుం న శక్తా దేవదానవాః | యో%నంతః పఠ్యతే సిద్ధైర్దేవర్షిగణపూజితః || 12

శిరస్సాహస్రయుక్తస్స సర్వా విద్యోతయన్ దిశః | ఫణామణిసహస్రేణ స్వస్తికామలభూషణః || 13

ముదాఘూర్ణితనేత్రో%సౌ సాగ్నిశ్శ్వేత ఇవాచలః | స్రగ్వీ కిరిటీ హ్యాభాతి యస్సదైవైకకుండలః || 14

సో%యం గంగాప్రవాహేణ శ్వేతశైలోపశోభితః | నీలవాసా మదోద్రిక్తః కైలాసాద్రిరివాపరః || 15

లాంగలాసక్తహస్తాగ్రో బిభ్రన్ముసలముత్తమమ్ | యో%ర్చ్యతే నాగకన్యాభిస్స్వర్ణవర్ణాభిరాదరాత్ || 16

సంకర్షణాత్మకో రుద్రో విషానలశిఖోజ్జ్వలః | కల్పాంతే నిష్క్రమంతే యద్వక్త్రే భ్యోగ్ని%శిఖా ముహుః |

దగ్ధ్వా జగత్త్రయం శాంతా భవంతీత్యనుశుశ్రుమ || 17

ఆస్తే పాతాలమూలస్థస్స శేషః క్షితిమండలమ్ | బిభ్రత్స్వపృష్ఠే భూతేశ##శ్శేషో%శేషగుణార్చితః || 18

తస్య వీర్యప్రభావశ్చ సాకాంక్షైస్త్రిదశైరపి | న హి వర్ణయితుం శక్యస్స్వరూపం జ్ఞాతుమేవ వా || 19

ఆస్తే కుసుమమాలేవ ఫణామణిశిలారుణా | యస్సై#్యషా సకలా పృథ్వీ కస్తద్వీర్యం వదిష్యతి || 20

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఓ మునీ! వినుము. బ్రహ్మాండము ఎంత గొప్పదియో మరియు ఎంతటి విస్తారము గలదియో సంక్షేపముగా చెప్పెదను. దీనిని విన్నచో, పాపమునుండి విముక్తి కలుగును (7). నామరూపములుగా

అభివ్యక్తము కాని ఆ జగత్కారణమగు పరంబ్రహ్మ దోషరహితమైన శివతత్త్వము రూపములో వ్యక్తమగును. అది కాలక్రమములో రెండు అగును. దాని నుండి బ్రహ్మ పుట్టును (8). ఆ బ్రహ్మ పదునాల్గు భువనములతో కూడిన బ్రహ్మాండమును సృష్టించును. ఆ వివరములను క్రమముగా చెప్పెదను. ఓ కుమారా! దానిని శ్రద్ధగా వినుము (9). ఏడు పాతాళలోకములు గలవు. వీటికి పైన ఏడు ఊర్ధ్వలోకములు ఉండుటచే, నీటి మధ్యలోనున్న బ్రహ్మాండముయొక్క ఎత్తు రెట్టింపు అగును (10). దానికి ఆధారము సర్పము. ఆ సర్పము విష్ణువు అని కీర్తించబడినది. బ్రహ్మయొక్క వచనముచే ఆ సర్పము ఈ సర్వమును మోయుచున్నది (11). ఈ శేషుని గుణములను దేవతలు గాని, రాక్షసులు గాని వర్ణించలేరు. దేవతలచే, మరియు ఋషిగణములచే పూజింపబడే ఆ శేషుని సిద్ధులు అనంతుడని కీర్తించెదరు (12). ప్రకాశించే స్వస్తికయే ఆభరణముగా గల ఆ శేషుడు వేయి తలలు గలవాడై వేయి పడగలపై నున్న మాణిక్యములచే దిక్కులనన్నింటినీ ప్రకాశింపజేయును (13). బలగర్వముచే తిరుగుచున్న నేత్రములు గలవాడు, మాలను కిరీటమును ధరించినవాడు, ఒకే కుండలము గలవాడు అగు ఈ శేషుడు తెల్లని పర్వతమువలె ప్రకాశించుచున్నవాడై గంగా ప్రవాహముతో కూడిన రెండవ కైలాసమా యన్నట్టు విరాజిల్లుచున్నాడు (15). చేతివ్రేళ్లతో నాగలిని పట్టినవాడు, ఉత్తమమగు ముసలాయుధమును ధరించినవాడు అగు శేషుని బంగరు కాంతులతో ప్రకాశించే నాగకన్యలు ఆదరముతో కొలిచెదరు (16). విషాగ్నియొక్క జ్వాలలచే అతిశయించి ప్రకాశించే ఆ శేషుడు సంకర్షణరూపములో నున్న రుద్రుడే. ప్రలయకాలమునందు ఆయన నోళ్లనుండి అనేకపర్యాయములు అగ్నిజ్వాలలు బయల్వెడలుచుండును. అవి ముల్లోకములను తగులబెట్టి చల్లారునని వినియుంటిమి (17). సర్వభూతాధిపతి, అనంతగుణములచే ప్రకాశించువాడు అగు ఆ శేషుడు పాతాలముయొక్క మూలములో నున్నవాడై భూమండలమును తన పడగలపై ధరించి యుండును (18). ప్రజ్ఞాశాలురగు దేవతలైననూ ఆయనయొక్క శక్తి ప్రభావమును వర్ణించుటకు, మరియు ఆయనయొక్క స్వరూపమును

తెలుసుకొనుటకు సమర్థులు కారు (19). పడగలపై గల మణులు కాంతులచే ఎర్రగా ప్రకాశించే సమస్తమగు భూమండలము ఎవనిపై పూల మాలవలె నున్నదో, అట్టి శేషుని బలమును ఎవడు వర్ణించగలడు ? (20)

యదా విజృంభ##తే%నంతో మదాఘూర్ణితలోచనః | తదాచలతి భూరేషా సాద్రితోయాధికాననా || 21

దశసాహస్రమేకైకం పాతాలం మునిసత్తమ | అతలం వితలం చైవ సుతలం చ రసాతలమ్ || 22

తలం తలాతలం చాగ్ర్యం పాతాలం సప్తమం మతమ్ | భూమేరధస్సప్త లోకా ఇమే జ్ఞేయా విచక్షణైః || 23

ఉచ్ఛ్రాయో ద్విగుణశ్చైషాం సర్వేషాం రత్నభూమయః | రత్నవంతో%థ ప్రాసాదా భూమయో హేమసంభవాః || 24

తేషు దానవదైతేయా నాగానాం జాతయస్తథా | నివసంతి మహానాగా రాక్షసా దైత్యసంభవాః || 25

ప్రాహ స్వర్గసదోమద్యే పాతాలానీతి నారదః | స్వర్లోకాదతిరమ్యాణి తేభ్యో%సావాగతో దివి || 26

నానాభూషణభూషాసు మణయో యత్ర సుప్రభాః | ఆహ్లాదకాని శుభ్రాణి పాతాలం కేన తత్సమమ్ || 27

పాతాలే కస్య న ప్రీతిశ్చేతశ్చేతశ్చ శోభితమ్ | దేవదానవకన్యాభిర్విముక్తస్యాభిజాయతే || 28

దివార్కరశ్మయో యత్ర న భవంతి విధోర్నిశి | న శీతమాతపో యత్ర మణితేజో%త్ర కేవలమ్ || 29

భక్ష్యభోజ్యాన్నపానాని భుజ్యంతే ముదితైర్భృశమ్ | యత్ర న జ్ఞాయతే కాలో గతో%పి మునిసత్తమ || 30

పుంస్కోకిలరుతం యత్ర పద్మాని కమలాకరాః | నద్యస్సరాంసి
రమ్యాణి హ్యన్యాన్యవిచరాణి చ || 31

భూషణాన్యతిశుభ్రాణి గంధాఢ్యంచానులేపనమ్ |
వీణావేణుమృదంగానాం స్వనా గేయాని చ ద్విజ || 32

దైత్యోరగైశ్చ భుజ్యంతే పాతాలే వై సుఖాని చ | తపసా సమవాప్నోతి
దానవైస్సిద్ధమానవైః || 33

ఇతి శ్రీశివమహాపురాణ ఉమాసంహితాయాం పాతాలలోకవర్ణనం
నామ పంచదశో%ధ్యాయః (15).

మత్తుచే నిండియున్న కన్నులు గల శేషుడు తన శరీరమును సాగదీసినప్పుడు, పర్వతములతో, సముద్రములతో మరియు వనములతో నిండియున్న ఈ భూమి కంపించును (21). ఓ మహర్షీ! భూమికి దిగువన అతల-వితల-సుతల-రసాతల-తల-తలాతల-పాతాలములనే ఏడు అధోలోకములుగ లవు. వాటిలో ప్రతి ఒక్కటి పదివేల యోజనముల నిడివి కలిగియున్నదని విద్వాంసులు చెప్పెదరు (22, 23). వాటి ఎత్తు నిడివికి రెట్టింపు ఉండును. ఈ లోకములన్నింటిలో భూములు రత్నములతో నిండియుండును. ప్రాసాదములు రత్నములచే పొదగబడి యుండును. వాటి ఉపరితలములు బంగారముతో నిర్మింపబడి యుండును (24). వాటిలో దానవులు, దైత్యులు, నాగజాతులు, మహానాగములు, దైత్యవంశస్థులగు రాక్షసులు నివసించెదరు (25). ఈ లోకములనుండి స్వర్గమునకు వచ్చిన నారదుడు స్వర్గసభామధ్యములో పాతాళలోకములు స్వర్గలోకము కంటే మిక్కిలి సుందరమైనవని చెప్పెను (26). పాతాళములో ఆభరణములన్నింటియందు గొప్ప కాంతులను విరజిమ్మే స్వచ్ఛమగు మణులు ఆహ్లాదమును కలిగించుచుండును. పాతాళముతో సమానమైన స్థానము ఏది గలదు? (27) అక్కడక్కడ దేవదానవకన్యలతో ప్రకాశించే పాతాళమునందు ఇహలోకమునుండి విముక్తిని పొందిన ఏ జీవునకు ప్రీతి కలుగకుండును? (28) అక్కడ పగలు సూర్యకాంతులు, రాత్రి చంద్రకిరణములు, చలి, ఎండ ఉండవు. అచట కేవలము మణుల కాంతులు మాత్రమే ఉండును

(29). ఓ మహర్షీ! అచట నివసించు వారు వివిధభక్ష్యములను మరియు అన్నములను భుజించి పానీయములను త్రాగి మహానందమును పొందెదరు. అచట కాలము గడిచినట్లు తెలియదు (30). అచట గండు కోకిలలు కూయుచుండును. నదులు సరస్సులు పద్మములతో మరియు కలువలతో నిండి ఒకదానిని మించి మరియొకటి ప్రకాశించుచుండును (31). అచటి ఆభరణములు అతిస్వచ్ఛముగా నుండును. అనులేపనములు (పైపూతలు) సుగంధభరితములైన యుండును. ఓ బ్రాహ్మణా! అచట వీణ, వేణువు, మృదంగము అను వాద్యముల ధ్వనులు మరియు గేయములు వినవచ్చును (32). పాతాళలోకసుఖములను దైత్యులు, నాగులు అనుభవించెదరు. దానవులు మరియు సిద్ధపురుషులు తపస్సుచే ఆ సుఖములను పొందెదరు (33).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు
పాతాళలోకవర్ణనమనే పదునైదవ అధ్యాయము ముగిసినది (15).